మూఘాను పేటయందు ఇటీవలజరిగిన మహాసభలయందు గావింపబడిన అనేక తీర్మానములలో మూడు మాత్రము ప్రత్యేక దగి యున్నవి. జమీందారీలను నిర్మూలించుట. ఇట్టిసభలగ వించినపుడు ఇంతవరకు గను గావించుచుండిన పద్ధతులకును నేటితీర్మానమునకు ఇంచుక భేదము గన్పడుట కొంత చిహ్నము ప్రభుత్వశాసనముచే జమీందారీలు నిర్మూలనము గావింపబడవలయునని తీర్మానించుటచేత, తామేఅందుకు గడంగమని ధ్వనించుటవీరిపూర్వచరిత్రకు విపరీతమైనను, ఆలోచనాసమన్వితమై యుండవలయును. (3) శాసనసభలకుగాని, స్థానిక సంఘములకుగాని, జమీందారులుగాని, వారియిలాకావారు గాని నిలవ రాదట, ఇంక జమీందార్లదిగ్విజయము నుసాధించెదరో, రైతాంగముపైన గలపలుకుబడి మూలమునో, ఓట్లసంపాదించి, సామాన్యులకు అవకాశము నొసగకుందురనే భయముండునని యూహించితిమి. వారియిలాకావారికిని ఓట్లనొసగ రాదని బహిష్కృత ప్రయోగము చేయుట యందలి యర్థము ఊహ్యమగుటలేదు జవాబుదారీలేని కొందరు తీర్మానములను వ్రాసియిచ్చినను అనుభవశాలులైనవారీ తీర్మానముల నెటుల నంగీకృతము గావించిరో తలప సాధ్యమగుటలేదు. ఇలాకాఅనిన రాజబంధువులనియా, రాజసేవకులనియా, రాజాగారిరైతులనియా? మరెద్దియో ఊహ్యము ప్రాజ్ఞులు టీకవ్రాయుదురుగాక.

ఇకజమీందారుల అవిభాజ్యతనుగూర్చి. ఇదెంతేయును రయితులకు అప్రస్తుతమైనది. కానున్న నీలలజడి కారకుల హృదయ ప్రతిబింబమైనం గావలయును. జమీందారులుండిన ఒక్కరానితనమా? దేశమున ధనికులుండరాదనియా? భరతవర్షము దారిద్ర్యనారాయణ ప్రీతమును ఎన్నిటికిని వదలకూడదనియా? జమీందారీ విభాజ్యములై భీభత్సములై మనలోవారును గలియవలయుననియా? అటులయినచో నీఆదర్శమును ప్రారంభమున కొత్తియములకు, గ్రామములకుబ్రవేశపెట్టి విజయవంతమయినచో, పెద్దసంస్థానముల కన్వయింపజేయుదము. వెర్రివేదాంతముల తీర్మానించుకొనుటకును, అన్వయింప జేసుకొనుటకు హస్తిమశకాంతరమని ప్రాజ్ఞులెరింగెదరు గాక.

—

### విన్నపము

గత వారము దశారా వారమగుట చేత పత్రిక వెలువరించ జాలక పోతిమని పాఠక మహాశయులకు విన్నవించుకొనుచున్నాము.

సం॥ స్వ॥ రై॥

## రాజాగారి తాలూకాలలో అలజడి:

ఇటీవలకొంత కాలమునుండి వెంకటగిరి రాజాగారి గ్రామాదులలో కొంతఅలజడి జరుగుచున్నది. అనేకచోట్ల రకరకముల సభలుజరుగుచున్నవి, చిత్రవిచిత్రమైన తీర్మానములు జరిగినట్లు పత్రికలలో చదువుచున్నాము: ఒక జమీందారీ రైతుల సంఘము అను సంస్థయుండునట్లు దానిమూలమున ఈఅలజడి అంతయు జరుగుచూ వున్నట్లును వినబడుచున్నది. మాగ్రామాలలో స్థితిగతులు విచారించుటకు పూనుకొంటిమి ఏమిచిత్రములు అగపడుటలేదు. అక్కడక్కడ కొన్నిఇబ్బందులు రయితుల కుండు మాటనిజమే. ఇట్టిఇబ్బందులు సర్కారు గ్రామాలలో కూడా కలవు. సర్కారు ప్రదేశముల విషయంలో నెన్నియోప్రదేశములుజలాధారములు లేకుండా, వర్షాధారమైన నాధారము వైపని లేక పోలేదు. ఎన్నియో గ్రామములకు చెరువులు లేనివికూడా గలవు. సర్కారువారు రిసెటిల్మెంటు అను పేరతోను రేటు ఎక్కించుచుండు విషయము మనకు తెలియనిదికాదు.

ఇక సర్కారు గ్రామములలో సర్కారు పైకము చెల్లించుపద్ధతులనే జమీందారీలయందుకూడా ప్రవేశపెట్టవలయునని ఇటీవలఉద్యోగులు వాదించుచున్నారు ఒకవేళ వసూలుచేయుకాలము అనుకూలమున మార్చిన మార్చవచ్చును గాని, పద్ధతి మార్చుటచే ఎక్కువ బాధలు కలుగగలవు. సర్కారు కిస్తులను చెల్లించునపుడు రయితులపడు బాధలు దైవమునకే ఎరుక నుమారు 4, 5, సంవత్సరములుగా రివిన్యూఉద్యోగస్తులు రయితుల పెట్టునట్టిబాధలు వర్ణనాతీతములు పయికమునకై తానెంత ఇబ్బందిపడినను రయితు కాలయాపన చేయుటకు సాధ్యముగాదు. నెలాఖరు లోపల ఇల్లో వాకిల్లో తాకట్లు పెట్టియో రూపాయి పావలాకమ్మియో ముందు చెల్లించవలయును. లేదా రయితు ఆస్తిజప్తి గావింపబడును. వేలము వేయబడును. పడరానిపాట్లు పడవలయును. ఆసాములు వసూలు పూర్తిగాగలదనియు, లెక్కలు తీర్మానములు అగుచున్నవనియు, ఉద్యోగులకు పని పూర్తిఅగుననియును మనము దొరతనము వారి పక్షమున సంతసించవలయునేగాని, రయితు పక్షమున యోచించినచో, జమీందారీ పద్ధతియే శ్రేష్ఠమయినది. ఒకవేళ రయితు సమయమునకు పైకము చెల్లింపలేకున్నను, వెంటనే తమకు రివిన్యూ అధికారుల బాధలుండవు గాని తనగొడ్డుగోద తాలూకాకు అటు నేలాగయినను భయముండదు గదా? ఏ ధరలో సొమ్మును తెగనమ్మి పైకము ముందు చెల్లించవలసినదిగా నిర్బంధము లేదు

# విశ్రాంతిభవనము, నెల్లూరు.

## బైటివారల కిచట గల సౌకర్యము మరెచటను లభ్యపడదు.

ప్రస్తుత ఆర్థిక పరిస్థితులనుబట్టి మా భవనములో భోజన ఛార్జీలు తగ్గించవలయునని మా మిత్రులు సలహా నొసంగుటచే నష్టకష్టములకు వెనుదీయక తగ్గించవలసివచ్చినది.

కర్నూలు నెల్లూరు బియ్యముతో మామూలుగా నొసంగు అన్ని పదార్థములతోటి పూట 1.కి భోజనం 0.4.0 మాత్రమె.

మా భవనములో యేర్పాట్లన్నియు ఆరోగ్యముగను, పరిశుభ్రముగను రుచికరముగను వుండియు పాంథులకు సయితము రా నవకాశము గలుగునట్లు యేర్పాట్లు చేసియున్నాము. ఆంధ్రులు తప్పక మాకు ప్రోత్సాహము చేయ ప్రార్థన.

| | |
|---|---|
| పూట 1.కి భోజనము | 0—4—0. |
| నెల 1.కి భోజనము | 10—0—0. |
| స్పెషల్ భోజనము పూట 1.కి | 0—6—0. |
| మేలురకం కాఫీ కప్ 1.కి | 0—1—0. |

గదులు, స్నానములు, టిఫిన్‌లు, వగయిరాలకు ప్రత్యేకచార్జీ.

డి. శేషారెడ్డి, ప్రొప్రయిటరు.

# ఆయుర్వేద ఫార్మసీ,

## గాంధిచౌక్, నెల్లూరు.

మహాశయులారా!

భారత దేశమున దేవసమానులగు మహర్షులు ప్రజాసంరక్షణార్థమై మహాతపము కృషిసల్పి ఉత్తమములగు ఆయుర్వేద ఔషధ శాస్త్రములను నిర్మించియున్నారు. అట్టి ఉత్తమమగు గ్రంథములు అనేకములుండగా అనేకులు నవయుగ వైద్యులు అట్టి శాస్త్ర పరిశోధన, శాస్త్ర ఆచరణ, అలక్ష్యమనియు, ఆదాయము లేదనియు, కృత్రిమ కల్పితశాస్త్రములలోనుండు చిట్కాలను తాత్కాలికముగా తయారుచేసి ప్రజలను మోసపుచ్చుటయేగాక, ఆయుర్వేద ఔషధ ప్రభావము లఘువు, తిరస్కారభావమైన వైద్య గ్రంథములను తీసి శరీరము నాపాదించుటంబట్టి ఆయుర్వేద ఔషధములు శాస్త్రయుక్తముగా తయారుచేసి, అనుభవయుక్తముగా నొసంగిన యెడల సమస్త కఠిన వ్యాధులును నిర్మూలము చేయుటకు ఆయుర్వేద ఔషధములకు శక్తిగలదని, తెలుపుటకుగాను ఈ ఫార్మసీని మా సింహపురమున నెలకొల్పినాము. ఇచ్చట తయారుచేయబడు ముఖ్యమగు ఔషధములను ఒకసారియైనను వుపయోగించి దానియొక్క ఫలమును అనుభవింప ప్రార్థన.

ఇచ్చట తైలచూర్ణములు. లేహ్యములు, చూర్ణములు, భస్మములు, మాత్రలు, వర్తులు, అరిష్టములు, ఆసవములు, రసాయనములు, వంట ఔషధములు, తయారు చేయబడుచున్నవి. కల్తీ ఔషధములను వుపయోగించి లేని కష్టములను తెచ్చుకొనక, మాచే తయారుచేయబడు ఔషధములనే వుపయోగించుడు.

ఆయుర్వేద ఫార్మసీ, గాంధిచౌక్, నెల్లూరు.

దేవిరెడ్డి శేషారెడ్డి, ప్రొప్రయిటర్.

Editedand Published by D. Sesha Reddy and Printed at the Simhapuri Press, Nellore.